# కలసి బ్రతుకుదాం

1958 లో భారత ప్రభుత్వ
బహూకృతినొందిన గ్రంథము

రచన:
జి. సురమౌళి

దీప్తి ప్రచురణాలయం,
సూర్యాపేట - నల్లగొండజిల్లా.




ప్రథమ ముద్రణ
మే — 1959

చిత్రాలు:
శ్రీ కె. వెంబు
విజయవాడ - 2.

ముద్రణ:
విజయ ప్రెస్,
విజయవాడ - 2,

ప్రతులకు:
నవోదయ పబ్లికేషన్సు
ఏలూరు రోడ్డు, విజయవాడ-2



పూజ్యులగు నాయనగారికి నమస్కారములు.

ఇన్ని రోజుల తరువాత మీకు నేను ఉత్తరం రాస్తున్నందుకు మన్నించండి. ఇన్నాళ్లు నాదారినాదిగా మీదారి మీదిగా బ్రతికినాము. దానివలన ఏర్పడిన చిక్కులు అనుభవించినాము. నాదే తప్పని తెలుసుకొన్నాను. ఇప్పు డీ పెద్ద ఉత్తరం మీకు రాస్తూ ఇన్ని రోజులనుండి నేను చేస్తున్న తప్పును మన్నించమని వేడు కొంటున్నాను.

మీకు కొన్ని అలవాట్లు ఉన్నవి. వాటిని మీరు విడువకుండా పట్టుకొన్నారు. మీరు చదువు చెప్పించినందువల్ల కొన్ని క్రొత్త అలవాట్లు నేను నేర్చుకున్నాను. మీకవి నచ్చలేదు. నేను నాక్రొత్త ఆశయాలను మీతో చర్చించి ఒప్పించవలసియుండెను. మీ సహాయము లేకుండనే నేను క్రొత్త లోకానికి బయలుదేరినాను. ఈ క్రొత్త లోకం వట్టి పుస్తకాల ప్రపంచమే అయింది గాని, నేను కన్న కలలు నిజంకాలేదు.

మీరు నన్ను అర్థం చేసుకోలేదు. పాత అలవాట్ల వలన వచ్చే నష్టాలు అనుభవిస్తున్నారు. వాటివలన కష్టాలు పడుతున్నారు. కాని మీ అభిప్రాయాలను మార్చుకొనుటలేదు. పైగా మీరు వయస్సు మీరి దినదినం అశక్తు లౌతున్నారు. నేను మీతో వేరై నా బ్రతుకు నేను చూసుకోవడం వలన మీరు ఒంటరివారై పోయినారు. ఈ విధంగా ఒకరివల్ల జరిగిన తప్పుకు ఇద్దరం బాధపడుతున్నాం. వేరువేరయి పోయి ఇద్దరం కష్టపడుతున్నాం. ఇద్దరమూ కోరికలను పూర్తిచేసుకోలేకపోతున్నాము. అందుకనే మనం ఇకనుండి కలిసి బ్రతుకుదామంటున్నాను. మీరూ నేనేకాదు, ఈ ప్రపంచంలో ఉన్న మనుష్యులందరూ కలిసి బ్రతకడం మొదలుపెడితే అందరి కష్టాలూ ఈడేరుతాయని మనవి చేస్తున్నాను.

ఒక మనిషి బ్రతకడానికి మూడు ముఖ్య అవసరాలు :- 1. కడుపునిండా తిండి. 2. కట్టుకోవడానికి చాలినంతబట్ట. 3. ఉండటానికి ఇంతనీడ. మానవునికి కొన్ని అవసరాలేమో పుట్టుకతోనే వుంటవి. మరికొన్ని అతడు పెరిగినకొద్దీ అలవాటు చేసుకొంటాడు. ఇటువంటి అవసరాలను పూర్తిచేసుకొనటానికి మనిషి ప్రయత్నిస్తుంటాడు. ఎల్లప్పుడు మనిషి ఏదో ఒక పనిని చేస్తూనే వుంటాడు. మీరొక్కసారి ఈ ప్రపంచంలో ఉన్న ఒక్కొక్క మనిషి పనులను పరిశీలించి చూడండి. ప్రతి మనిషి ఏదో తొందర పడుతున్నట్టు కనిపిస్తాడు. దేనికోసమో ప్రతివాడు పరుగుతీస్తున్నట్టు అనిపిస్తాడు. ఈ పరుగే ప్రపంచంయొక్క పోకడ. ఈ పరుగును పరిశీలించి సిద్ధాంతాలుచేసే శాస్త్రాన్ని "ఆర్థికశాస్త్రం" అంటారు. మొత్తం ఆర్థిక శాస్త్రాన్ని రెండుభాగాలు చెయ్యవచ్చు. ఒకటి

ఉత్పత్తి, రెండోది వాడకం. తన అవసరాన్ని పూర్తిచేసుకొనటానికి మనిషి ఎల్లప్పుడు ప్రయత్నం చేస్తుంటాడు. ఆ ప్రయత్న



మేమో ఉత్పత్తి. దానిఫలితాన్ని అనుభవించట మేమొ వాడకం. మీరు నాగలి దున్నుతారు, విత్తనాలు వేస్తారు, యెరువులు తోల్తారు, కలుపులు తీస్తారు, తుదకు పంటపండించి గాదెలు నింపుతారు. ఇదంతా మీ అవసరాలను మీరు పూర్తిచేసుకొనటానికి మీ ప్రయత్నం. మీరు చేసిందేమొ ఉత్పత్తి. అయితే మీరు చేసిన ఈ ఉత్పత్తి గాదెలలోనే ఉండిపోదు. మీరు దాన్ని తింటారు. ఇంకా మిగిలిన దాన్ని ఆకలి అవుతున్నవారికి అమ్ముతారు. ఈ ప్రకారముగా తమ అవసరాలను పూర్తిచేసుకొనడం వాడకం. అయితే మీకు కేవలం కడుపునిండుతే చాలదు. కట్టుకొనుటకు బట్ట ఖూడ కావాలె. మీరు తినగా మిగిలిన ధాన్యాన్ని అమ్మితే వచ్చిన

పైకంతోటి మీరు బట్టలు కొనుక్కుంటారు. మరొక మనిషి ఆ విధంగానే బట్టలు మాత్రమే ఉత్పత్తి జేస్తాడు. తనకు సరిపోంగ మిగిలిన బట్టలను మీ తోడివాండ్లకు అమ్ముతాడు. ఆ విధముగా వచ్చిన డబ్బుతో తిండిగింజలు కొనుక్కొంటాడు. దీన్ని అర్థ శాస్త్రంలో మార్పిడి అంటారు.

పూర్వకాలంలో రూపాయల, అణాల రూపంలో డబ్బు లేనప్పుడు ఈ మార్పిడి ఇప్పుడున్న రీతిగా లేకుండెను. పైస అనేది మధ్యవర్తిగ లేకుండగనే మార్పిడి అంతా జరుగుతుండేది. వడ్లు పండించిన ఆసామి, కుండలు చేసిన ఆసామికి వడ్లేఇచ్చి కుండలు కొనుక్కునేవాడు. బట్టలునేసిన ఆసామి వడ్లు పండించిన ఆసామికి బట్టలేఇచ్చి వడ్లు కొనుక్కునేవాడు. ఇప్పటికి మన వూళ్లలో ఇటువంటి మారకం పద్ధతి ఉన్నది.

నాయనగారూ, ఈ పద్ధతి ఉంటే ఏచిక్కూ ఉండేది గాదని పిస్తున్నది గాదూ? కాని పైసవచ్చిన తరువాతనే ఏచిక్కూ లేకుండ పోయింది. పైస లేనప్పుడు చాల చిక్కు యుండేవి.

మీరు వడ్లు పండించినారనుకొండి. మీవలెనే కొందరు వడ్లు పండించినారు. కొందరు బట్టలు నేసినారు. మరికొందరు తమకు చేతనైనవానిని ఉత్పత్తి చేసినారు. మీకు బట్టలు కావలసివచ్చి మీరు ఒక నేతవానివద్దకు వడ్లు తీసుకొనిపోయి బట్టలు ఇమ్మన్నారు. ఆ నేతవానికి అప్పటికే కావలసినన్ని వడ్లు లభించినవి. కనుక అతనికి వడ్లు అక్కరలేదు. కుండలు కావలెనన్నాడు. కుండలు చేసిన కుమ్మరికి కావలసినన్ని వడ్లూ, బట్టలూ దొరికినవి. మీకు ఇక బట్టలు ఎవరిస్తారు?





ఇంతేకాక కొన్ని వస్తువులు కొంతకాలమువరకే బాగుంటవి. చాలాకాలము వాటిని దాచుకుంటే అవి చెడి పోతవి. కూరగాయలు, పండ్లు మొదలైనవి ఒక్క రోజుకంటె ఎక్కువ కాలము నిలువ వుండవు. వాటిని ఉత్పత్తి చేసినవారు ఆ పదార్థములను ఎవరికో ఒకరికి ఆనాడే అమ్ముకోవాలె. వారికి అవసరమున్న పదార్థము ధాన్యము. తిండి అన్నింటికంటె ముఖ్యము గద. వడ్లు పండించిన వారికెవరికి ఆనాడు పండ్లు, కూరగాయల అవసరముండవు. కుమ్మరి నేతగాడు మొదలగువారు కొనుక్కుంటానికి సిద్ధముగనే ఉంటరు. గాని వారు ఉత్పత్తిచేసిన పదార్థములు వీరి కడుపులు నింపవు. పైసవచ్చి చిక్కులన్ని తొలగించింది. పైస అవసరములేని వారుండరు. పైసను తరతరాల వరకు దాచుకోవచ్చును. పైస

పుట్టిన తరువాతనే ధర. ధరతోపాటు అంగడి మొదలైన వన్నీ పుట్టినవి. ఇవన్నీ కలసి ఆర్థిక శాస్త్రమైనది.

అయితే ఆర్థిక శాస్త్రమంతా పైనచెప్పిన నాలుగు మాటలతోనే అయిపోదు. మనం చిత్ర విచిత్రమైన వస్తువులను చూస్తున్నాము. కాలం మారిన కొద్ది ఈచిత్ర విచిత్ర వస్తుపులు పెరిగి పోతున్నవి. పప్రంచములో జనసంఖ్య పెరుగుతున్నది. ఈ పెరుగుతున్న జన సంఖ్య తమ తమ అవసరాలను పూరించుకొనుటానికి ప్రయత్నం చేస్తున్నది. ఆ ప్రయత్నంలో పోటీ పడుతున్నది. పోటీలోనుంచి ఈ చిత్ర విచిత్ర మైన వస్తువులన్ని పుట్టుకొని వస్తున్నవి. మీకాలంలో స్నోలు, పౌడర్లులేవు. సబ్బులుకూడా లేవు. కాని ఇప్పుడవి పల్లె పల్లెకు ప్రాకినవి. వీటిని విలాస వస్తువులంటారు. కూడూ గుడ్డా నీడవంటి ముఖ్య అవసరాలను పూర్తి చేసుకోంగ మిగిలిన డబ్బును మనుషులు ఈ విలాస వస్తువులమీద ఖర్చు పెడుతారు. ఒక ఆసామి వచ్చి చంద్రుని మార్కు బీడీనే త్రాగండి అంటాడు. మరొకతను వచ్చి సూర్యుని మార్కు బీడీ ఆరోగ్యానికి మంచిది అంటాడు. నిజానికి ఏ బీడీ అయినా ఆరోగ్యానికి మంచిదికాదు. కాని వాడు చేసిన ఉత్పత్తులను అమ్ముకొనటానికి, లాభాలు సంపాదించుకొన టానికి అనేకమైన అబద్ధాలు ఆడుతాడు. అనేకవిధాలుగా కొనుగోలు దారులకు ఎరలను చూపిస్తాడు. రంగు రంగుల బొమ్మలు వేస్తారు. మొత్తానికి ఈఆర్థికశాస్త్రము ప్రపంచానికి మసిబూసి మారేడుకాయ చేస్తున్నది. ఇంతెందుకు? మీరు పంటపండిస్తారు. రామయ్య లక్ష్మ య్యలుకూడ పంటపండిస్తారు. సాహుకారువచ్చి మీపంటను కొంటాడు. మీరడిగిన ధరకు కొంటాడా? మీలో మీకు పోటీలు పెట్టి తక్కువ




ధరకు మీ పంటను పోసుకుపోతాడు. ఈ పద్ధతిని పోటీ ఆర్థిక వ్యవస్థ అంటారు. ఇప్పుడు ప్రపంచంలో ఉన్నది ఈ పోటీ ఆర్థిక వ్యవస్థనే. ఇందులో "దుడ్డు ఎవనిదైతే దూడ వానిదే" అవుతది. బాగా డబ్బున్నవాడు రాజ్యంచేస్తాడు. ఎవరికి తోచింది వారు స్వతంత్రంగా ఉత్పత్తిచేస్తారు. కష్టపడుతారు. తమ కష్టానికి ప్రతి ఫలం కోసం ఒకరితో ఒకరు పోటీపడుతారు. కొందరు తిండికిలేక మల మల మాడి చస్తుంటే మరికొందరు తిండి ఎక్కువై కడుపు నొప్పితో అన్నం అరగక బాధ పడుతుంటారు.

ఈ పోటీ ఆర్థికవ్యవస్థ ధనవంతులను మరీ ధనవంతులను చేస్తుంది. దరిద్రులను మరీ దరిద్రులను చేస్తుంది. డబ్బున్నవాడే తనపిల్లలకు పెద్ద పెద్ద ఉద్యోగాలిప్పించుకుంటాడు. పెద్ద పెద్ద చదువులు చెప్పించుకుంటాడు. సీమకుకూడ పంపిస్తాడు. వాండ్లే

పెద్దపెరిగి మళ్లీ ధనవంతులవుతారు. ఏమాత్రం ముక్కునుండి నీరుకారినా మంచి మంచి మందులు వేయించుకొని బాగుపడతారు. ఏ రోగమూ రాకుండా మంచి ఆహారం తింటాడు. మంచి ఇంటిలో ఉంటాడు. కాని, దరిద్రుడు కడుపునిండ తిండే తినజాలడు. ఆరోగ్యకరమైన తిండిసంగతి అతనికి తెలియనేతెలియదు. తన పిల్లలకు చదువుసంగతి అట్లావుంచి కొంచెం బలం వచ్చేదనుక పని లోకి పంపించకుండానన్నా ఉంచడు. పనిచేయటానికే దరిద్రులు పుట్టినట్లూ, అనుభవించడానికే ధనవంతులు పుట్టినట్లూ అనిపిస్తుంది.

ఈ పోటీ ఆర్థికవ్యవస్థ తెచ్చిపెట్టే మరొక అక్రమం మోసం. మోసంలేకుండ మనిషి ఈ ప్రపంచంలో పనికిరాడు. ఒక్క ఆత్మహత్య చేసుకోవటానికి తప్ప అమాయకుడు పోటీ ఆర్థికవ్యవస్థలో మరెందుకూ పనికిరాడు. ప్రతిచోటా మోసం. ఒక డొక సబ్బును తయారు చేస్తాడు. అందులో ఉన్నవీ లేనివీ అనేక సుగుణాల్ని కలిపి ఆ సబ్బుకు బాగా ప్రచారం చేసుకుంటాడు. మరొకడు మరోసబ్బును తయారుచేస్తాడు. అంతకు ముందునుంచే బాగా ప్రచారంలోవున్న ఒకసబ్బు పేరువంటి పేరును తన క్రొత్త సబ్బుకు పెట్టుకుంటాడు. అదే ఇది అని అమ్ముకుంటాడు.

ఈ మోసం కల్తీకి దారితీస్తుంది. ఈ కల్తీవ్యాపారం అనారోగ్యానికి దారితీస్తుంది. బియ్యంలో రాళ్లు కలుపుతారు. నెయ్యిలో వేరుశెనగనూనె కలుపుతారు. తేనెలో బెల్లపు పాకం కలుపుతారు. ఆ విధంగా కలగా పులగం వస్తువులను అందమైన పొట్లాలుకట్టి, జగజగ మెరిసే బొమ్మలు అతికించి, బాగాప్రచారంచేసి, పత్రికల్లో కూడ అచ్చువేసి, అవే అన్నిటికన్న మంచివని చెప్పుతారు.

గోధుమ పిండి పేరుచెప్పి జొన్నపిండి అమ్ముతారు. ఈ మోసానికి పెద్ద పెద్దవాళ్ళే తట్టుకోలేరు. చదువురాని పల్లెటూరి ప్రజలకు ఎట్ల తెలుస్తాయి? మందుకోసం కొనుక్కున్న తేనె తేనెగాక బెల్లపురసం అయితే మనిషి రోగం ఎట్లానయంగావాలె? రోగం నయంగాకుండ మనిషి ఎట్ల బ్రతుకాలె? మనిషిని నమ్మటానికి వీలులేకుండ పోతున్నది. ఇదంతా పోటీ ఆర్థికవ్యవస్థ తెచ్చిన ఫలితం.

ఈ పోటీ ఆర్థికవ్యవస్థ మానవులను రెండువర్గాలుగా చీలుస్తున్నది. ఈ రెండువర్గాలు ఒకదానితో ఒకటి ఎల్లప్పుడు పోట్లాడుతుంటవి. ఈ పోట్లాట పోటీ ఆర్థికవ్యవస్థ ఉన్నంతవరకు



సాగుతూనే ఉంటుంది. మీరు మీ పాలేర్లకిచ్చే జీతంచాలదని పాలేర్లు ఎల్లప్పుడు మీతో మొరబెట్టుకుంటారు. మీరెమో, చేస్తే చెయ్యి

లేకపోతే మానుకొమ్మంటారు. ఎందుకంటే మీ పాలేర్లు కోరినంత జీతం ఇస్తూపోతుంటే మీకు నష్టం వస్తుంది. మీ ఉనికికే ముప్పు వస్తుంది. అసలు మీ అభిప్రాయంతోటి చూస్తే మీరు వాండ్లకిచ్చేది ఎక్కువ. వాండ్ల అభిప్రాయంతోటి చూస్తే అది చాల తక్కువ.

ఈ పోటీ ఆర్థికవ్యవస్థలో బ్రతుకు అనేది శిక్షగా తయారైంది. ప్రతిదినం కోట్లమంది ప్రజలు చావును కోరుకుంటున్నరు. నిజంగా జీవితం శిక్షకాదు. ఇది ఒక్కటే ఆనందాన్ని అనుభవించే సాధనం. బ్రతుకులో పూలు పూయించుకోవాలంటే ఈ బ్రతుకునే మనం నందనవనం చేసుకోవచ్చు. దానికోసం ఈ పోటీ ఆర్థిక వ్యవస్థనుంచి సమాజాన్ని మర్లించాలె.

పోటీ ఆర్థికవ్యవస్థనుంచి సమాజాన్ని మర్లించాలె అన్నాను. మరి దాన్ని ఏ ఆర్థికవ్యవస్థ దగ్గరకు తీసుకుపోవాల్నంటె-సహకార ఆర్థికవ్యవస్థ దగ్గరికి.

మనమందరమూ కలిసి బ్రతుకటానికి సహకారం పునాది. పుట్టుకతోటే మనిషికి సహకారం అబ్బుతది. మనం ఒంటరిగా బతకలేం. మన చుట్టుపక్కల వాండ్లతో ప్రతిదినం మనం పోట్లాడుతున్నప్పటికీ వాండ్లు లేకపోతే మన బతుకులు ఎండిపోతవి. మనుషులెవరూ లేని అడవిలో ఎవరినన్నా వదిలిపెడితే భయపడి బెంగపెట్టుకుని చచ్చిపోతాడు. తనతో మాట్లాడటానికి, తనను ప్రేమించటానికి, తనతో ప్రేమించబడటానికి—తనతో కనీసం పోరాడటానికైనా ప్రాణికి ఒకరు అవసరం. అందుకే అడవులలో ఒంటరిగా ఉండి తపస్సు చేసుకుంటున్న మునులుకూడా కొన్ని

పక్షులను, జంతువులను—అంటే రామచిలుకలనూ, లేళ్ళను, జింక లను పెంచుకొని వాటితో ఆడుకొంటూ పాడుకొంటూ వాటినే ప్రేమిస్తూ కాలం గడుపుతారు.

ఈ విధంగా మనిషిలో పుట్టుకతోటేవున్న సహకార భావాన్ని ఈ పోటీ ఆర్థిక వ్యవస్థ వచ్చి అణచిపెట్టింది. సహకార భావం అంటే ఏందోకాదు - కలుపుగోలుతన మన్నమాట. అది మంచిదిగాదని ఎవరంటారు? కాని ఈ పోటీ ఆర్థిక వ్యవస్థలో అది సాగదు. మనిషిలోఉన్న ఈ కలుపుగోలుతనాన్ని పైకిలాగితే మనిషిలో ఉన్న మంచితనంగూడ పైకివస్తుంది. అప్పుడు మన మందరము కలసి కమ్మగ బ్రతుకవచ్చు.

మన వూళ్ళో ఒక సహకార సంఘం ఉన్నది. అది అవ సరమైన వాళ్ళకు అప్పులియ్యాలె. కాని అది బాగా పని చేస్తు లేదు. దానితో మనకు కలుగవలసిన ఫలితాలు కలుగుటలేదు. అది మన వూళ్ళో పెట్టి పదిఏండ్లు దాటింది. మనుషులనడుమ ద్వేషాన్ని అది రూపు మాపలేదు. అందరం కలిసి బ్రతుకుదామనే అభి ప్రాయాన్ని అది ప్రచారం చేయలేదు.—ఎందుకని?

మీరూ నేనూ అదేదో లెమ్మని దానికి దూరంగాఉన్నాం. కొంచెం నాలుగక్షరాలు తెలిసిన తెలివిగల నలుగురైదుగురు అందులో పీఠం వేసుకొని కూర్చున్నారు. ప్రభుత్వంవారితో వారు అబద్ధాలాడుతారు. సర్కారుకు వారు ఏమని చెప్పుతారో తెలుసా? మన ఊళ్ళో ఉన్న వాండ్లందరికీ ఆ సహకారసంఘం అప్పులిస్తున్న దన్నీ, అందరూ అందులో సభ్యులమని చెప్పుతారు. ఒక్కడే

నాలుగునూర్ల రూపాయలు తీసుకొని, ఊళ్ళో వాళ్ళ ఎనమండుగురి పేర్లు రాసి, ఆ ఎనమండుగురికి తలా ఒక యేభయి రూపాయలు యిచ్చినట్టు లెక్కలు రాస్తారు. ఇదంతా ఎందుకు జరుగుతున్నది? మీరు జరగనిస్తున్నారు గనుక జరుగుతున్నది. మీరుగూడ జరగని వ్వాల్నని జరగనిస్తులేరు. మీ కెవ్వరూ ఈ కిటుకులన్నీ చెప్ప లేదు. నేనుగూడ పుస్తకాల నడుమపడి కలలుకంటూ మిమ్మలను- వదలివచ్చాను. అందుకని మోసం సాగుతున్నది. మోసాన్ని తుడుచడానికి పెట్టిన సహకార సంఘంలో మోసగాండ్లు పీఠం వేసుకుంటే ఏమైతది? కంచె చేన్నుమేస్తది. మనం దీన్నింక సాగనివ్వగూడదు.

సహకారం అనేది ఒక అప్పులవరకే ఉండి ఆగిపోదు. మన బ్రతుకులకు కావలసినది ఒక్క అప్పులు మాత్రమే కాదు. కేవలం డబ్బుండగానే బ్రతుకులు నందనవనాలు కావు. బ్రతుకులోని అన్ని అవసరాలను మనం సహకారం ద్వారానే సాధించుకోవాలె. సహకార పద్ధతి మీదనే ఉత్పత్తి చేసుకోవాలె. సహకార పద్ధతి మీదనే వ్యవసాయం చేసుకోవాలె. సహకార పద్ధతి మీదనే ఉత్పత్తిని అమ్ముకోవాలె. సహకారపద్ధతి మీదనే మనకు కావలసిన వస్తువులను కొనుక్కోవాలె. సహకార పద్ధతిమీదనే పిల్లలకు చదువు చెప్పించుకోవాలె. సహకార పద్ధతి మీదనే మనకు వచ్చే రోగాలను నయం చేసుకోవాలె. మందులు సహకార పద్ధతిమీదనే కొనుక్కోవాలె. మొత్తమ్మీద అన్నిపనులు సహకార పద్ధతిమీదనే జరుగాలె. మన ఊరంతా ఒక కుటుంబం అనుకోవాలె. మనఊళ్ళో ఉన్న పిల్లలందరు మనపిల్లలు. వరదక్షిణకు డబ్బులేక ఏ ఆడ

పిల్లా, బడిఫీజుకు డబ్బులేక ఏ మగపిల్లవాడూ ఆత్మహత్యలు చేసుకోవద్దు. ఇండ్లల్లోనుంచి పారిపోవద్దు. తలి దండ్రుల అప్పుల బరువును చూడలేక మన అక్క చెల్లెండ్లు ఉరి పోసుకొని చావకూడదు. ఒకనికి ఆకలి మరొకనికి కడుపునొప్పి ఉండకూడదు. అందరూ కడుపునిండా తినాలె. అందరూ ఆనందంగా ఉండాలె. మనం కనుక కలిసి బ్రతుకటానికి పూనుకుంటె ఈ విధంగ స్వర్గాన్ని తీసుకొనివచ్చి మన పల్లెలో నిలుపుకోవచ్చు.—ఏమంటారు?

కోడలుకు పచ్చి బర్రెజున్ను రుచిచూడక నాలిక రుచి మరచి పోయిందట. మీకు నమస్కారం రాయిమని మరీ మరీ చెప్పింది. పిల్లవాడు ఆడుకుంటున్నాడు.

సెలవు
మీ వాడు.



# రెండో ఉత్తరం

పూజ్యులగు నాయనగారికి నమస్కారములు.

మీఉత్తరం అంది చాలా సంతోషమైనది. నేను రాసిన విషయాలను మీరు శ్రద్ధగా చదివినందుకు నాకు కలిగిన ఆనందానికి మేరలేదు. ఈఉత్తరంలో మీరుకోరిన ప్రకారం సహకార సంఘాలు ఎన్ని విధాలుగా ఉంటవో రాస్తాను.

## ౧. సహకార పరపతి సంఘాలు



మనదేశములో బాగా ప్రచారంలో ఉన్నవి అప్పుల సహకార సంఘాలు. వీటినే పరపతి సహకార సంఘాలని అంటారు. ఇవి పల్లెటూర్లలోను, పట్టణాలలోను ఉంటవి. పల్లెటూర్లలో ఉన్న పరపతి సంఘాలలో రైతులు తమ పంటలు పండగానే కొంత ధాన్యాన్ని పోస్తారు. ఆ ధాన్యాన్ని సహకార సంఘమువారు అవసరమున్న వాండ్రకు నాగులకు ఇస్తారు. నాగుల రేటు చాలా తక్కువగా ఉంటుంది. సహకార సంఘంయొక్క ఆశయం



అందరికి సహకరించడంగాని లాభాలు సంపాదించుకోవడం కాదుగద! అయినా ఎంతో కొంత లాభం లేందే సహకార సంఘంలో

ఎవరూ చేరరు. ఈ ధాన్యం మీద వచ్చిన లాభాలను అందరికీ తమ తమ భాగాలనుబట్టి పంచుతారు. మాటవరుసకు మీరు సహకార సంఘానికి నాలుగు పల్లాల ధాన్యం ఇస్తారనుకోండి. మరొకరు



మూడు పల్లాలు, ఇంకొకాయన అయిదు పల్లాలు ఇస్తారు. మొత్తం పన్నెండు పల్లాల ధాన్యమైంది. సహకార సంఘంవాండ్లు ఆ పన్నెండు పల్లాల ధాన్యాన్ని నాగులకిచ్చి అదనంగా పదిహేను సేర్ల ధాన్యం ఎక్కువ సంపాదించినారు. ఈ పదిహేను సేర్లలో నుండి మూడుసేర్ల ధాన్యం తరుగులక్రింద తీసి కడమ పన్నెండు సేర్ల ధాన్యాన్ని పంచుతారు. మీకు నాలుగుసేర్లు, మూడుపల్లాలు పోసిన



ఆసామికి మూడుసేర్లు, ఐదుపల్లాలుపోసిన ఆసామికి అయిదుసేర్లు వస్తాయి. యిట్ల ధాన్యాన్నే ఒక్కదగ్గర కుప్పగా పోసి అప్పులిచ్చే పద్ధతిని గ్రేను బేంకుల పద్ధతి అంటారు. మన వూళ్లో కూడ ఇటువంటి గ్రేనుబేంకు ఒకటున్నది.

ధాన్యానికి బదులు డబ్బును ఒకచోట చేర్చి అప్పులిచ్చుకోవచ్చు. కనీస భాగం అని ఒకటి ఏర్పాటు చేస్తారు. పదిరూపాయలు కనీస భాగం అనుకుందాం. అంటే ఆ సంఘంలో చేరేవాండ్లందరూ కనీసం పదిరూపాయలు ఇవ్వాలన్న మాట. అయితే ఒక్కొక్కరు ఎన్ని

భాగాలన్నా కొనుక్కోవచ్చు. మీకు శక్తి ఉన్నది. కనుక మీరు వంద రూపాయలిచ్చి పది భాగాలను కొనుక్కోవచ్చు. ఇట్లా ఒక్కచోట కూడబెట్టిన డబ్బును అవసరమున్నవాళ్లు వడ్డీకి అప్పు తీసుకుంటారు. అప్పులు చౌకగా, తక్కువ వడ్డీమీద దొరుకుతవి. ఆ సంఘంలో చేరినవాండ్లకే అప్పులిస్తారు. మన సర్కారువాండ్లు ఇటువంటి సహకార సంఘాలకు మూలధనానికి మూడింతలు అప్పులిస్తున్నరు. అంటే మన వూళ్ళో అందరూ భాగాలు కొంటే మొత్తం పదివేల రూపాయలైనా యనుకొండి. ఈ కూడిన పదివేల రూపాయలకు సర్కారువారు మరొక ముప్ఫయి వేల రూపాయలిస్తారు. మొత్తం నలభయివేల రూపాయలను మనకందరికీ అప్పులిస్తారు. మనం ఇచ్చే వడ్డీని, సర్కారు వడ్డీ కట్టగా మిగిలిన దానిని మనమే మన మన భాగాలనుబట్టి పంచుకుంటం. ఎక్కువ భాగాలు కొన్నవారికి ఎక్కువ లాభాలు వస్తవి.

ఇటువంటి పరపతి సహకార సంఘాలు పట్టణాల్లో ప్రతి ఆఫీసుకు ఒకటి ఉంటది. ప్రతి ఫ్యాక్టరీకి ఒకటి ఉంటది. ఆయా ఆఫీసులలో, ఆయా ఫ్యాక్టరీలలో పనిచేసేవాండ్లు నెల జీతం రాంగానే తమ జీతంలోనుంచి కొంత డబ్బును సహకార సంఘంలో వేస్తారు. దాన్నే తమకు అవసరమున్నప్పుడు వడ్డీమీద అప్పుకు తీసుకుంటారు.

## ౨. పారిశ్రామిక సహకార సంఘాలు

మన వూళ్ళో చేనేత సహకార సంఘంవాళ్ళ బట్టల దుకాణం చూచేవుంటారు. ఇదొక పద్ధతి సహకార సంఘం. దీన్ని పారి

శ్రామిక సహకార సంఘం అంటారు. ఒక పని చేసే వాండ్లందరు సంఘంగా ఏర్పడుతారు. వాండ్లకు కావలసిన ముడిసరుకు—అంటే నూలు, రాట్నాలకు ఏకులు, ఏకులకు పత్తి మొదలైంది సంఘమే కొంటది. తాము చేసిన ఉత్పత్తిని సంఘానికే అప్పగిస్తారు. మాట వరుసకు మనవూళ్ళో నూరు మగ్గాలున్నాయనుకుందాం. నూరు మగ్గాలకు ఏ మగ్గానికెంత నూలు కావలెనో సహకార సంఘం తెలుసుకొని అంత నూలు కొని మగ్గానికింత చొప్పున పంచుతుంది. నేతగాండ్లు తాము నేసినబట్టలను సంఘానికే ఇస్తారు సంఘం వాండ్లు వాటిని అమ్మి తమ కర్చులు పోంగా మిగిలిన లాభాన్ని అందరికీ పంచుతారు. దీంతోటి నేత గాండ్లకు మధ్య పోటీ నశిస్తుంది. సహకార భావం ప్రేమ పెరుగుతవి. ఒక్క చేనేతలోనే కాదు, ప్రతి వృత్తిలో ఇటువంటి సంఘాలు పెట్టుకో వచ్చు; కుమ్మరి వాండ్లందరు కుమ్మర సహకార సంఘం పెట్టుకో వచ్చు; కమ్మరి వాండ్లందరు కలిసి కమ్మరి సహకార సంఘం పెట్టుకోవచ్చు.

## 3. అంగడి సహకార సంఘం

మరొక పద్ధతి సహకార సంఘాలుంటవి. వాటిని మార్కె టింగు సహకార సంఘాలంటారు. ఒక వస్తువును ఉత్పత్తి చేసే టప్పుడు ఎవరికి తోచిన విధంగ వాండ్లు ఉత్పత్తి చేస్తారు. కమ్మర వాండ్లందరు కర్లు, పారలు చేస్తారు. వడ్లవాండ్లందరూ నాగండ్లు చేస్తారు. అయితే అమ్ముకొనేటప్పుడు మాత్రం అందరు కలిసి అమ్ముకుంటారు. ఎవరేది చేస్తే అది స్వంతంగ అమ్ముకోకుండా సంఘానికి తెచ్చి ఇస్తారు. సంఘం వాండ్లు దాని ధర నిర్ణయించి

అవసరమున్న వాండ్లకు అమ్ముతారు. వచ్చిన లాభాన్ని అందరికి, వారు తెచ్చి ఇచ్చిన వస్తువులను బట్టి పంచుతారు. ఇటువంటి సహకార సంఘాలవల్ల ధర గిట్టు బాటవుతుంది. పోటీ నశిస్తుంది.

## ४. కొనుగోలుదార్ల సహకార సంఘాలు

ఇంత సేపు జెప్పినవి మనం చేసిన వస్తువులను అమ్ముకొనేవి. మనకు కావలసిన వస్తువులను కొనుక్కొనుటానికి కూడ సహకార సంఘాలు పెట్టుకోవచ్చు. ఇట్టివాటిని కొనుగోలుదార్ల—లేక వాడకందార్ల—సహకార సంఘాలంటారు. మనం అందరం తలా ఇంతడబ్బు వేసుకొని ఒకకొట్టు పెట్టుకుంటం. అందులో మనకు కావలసిన వస్తువులన్నీ వుంటాయి. ఉప్పు, మిరపకాయలు, సబ్బులు, బట్టలు మొదలైనవన్ని వుంటవి. మనకు కావలసిన వాటిని మన కొట్టులోనుంచే మనం కొనుక్కోవచ్చు. మనం ఇచ్చిన పైసలోనుంచి కర్చులు పోంగా మిగిలిన లాభాలను మళ్ళీ మనమే పంచుకోవచ్చు.

ఇంతవరకు చెప్పినవన్ని తొలిమెట్టు సహకార సంఘాలు. వీటివలన మనిషిని దోపిడినుంచి రక్షింపవచ్చు. పరపతి సంఘాల వలన ఇమ్మడి ముమ్మడి వడ్డీలు గుంజే షాహుకారు ఇనుప చేతుల నుంచి రైతును విడిపించవచ్చు. ఉత్పత్తి చేసుకొని పోటీవలన, ఆ ఉత్పత్తికి ధర గిట్టక వచ్చినధరకే అమ్ముకొని, చాలీ చాలని ఆదాయంతో సగం కడుపుకు తినే పారిశ్రామికుణ్ణి - మార్కెటింగు సహకార సంఘాల ద్వారా, పారిశ్రామిక సహకార సంఘాలద్వారా బ్రతికించవచ్చు. అన్యాయంగా లాభాలు గుంజి అర్ధ రూపాయి

సబ్బును, రూపాయి కమ్మే కోమటి టక్కులనుంచి కొనుగోలు దార్ల సహకార సంఘం రక్షిస్తుంది. కాని ఇవి మనిషి మౌలిక జీవితంలో మార్పు తేవు. అమ్మకము మేరకు - లేక కొనుగోలు మేరకు ఉన్న కలుపుగోలు తనం వస్తువులను తయారు చేస్తున్న ప్పుడు ఉండదు.

## ౫. బహుళార్థ సహకార సంఘాలు

ఈ రక రకాల సహకార సంఘాలనుకలిపి ఒకే సంఘంగా పెట్టుకోవచ్చు. అట్లా పెట్టుకుంటే మనుషులు, పనిముట్లు ఎన్నో కలిసి వస్తవి. ఇటువంటి సహకారసంఘాలను బహుళార్థ సహకార సంఘాలు అని అంటారు. మన సర్కారువారు ఇప్పుడిప్పుడు ఇటు వంటి సహకార సంఘాలమీద ఎక్కువ శ్రద్ధ చూపిస్తున్నారు. ప్రతిపల్లెకు ఇటువంటి బహుళార్థ సహకారసంఘం ఏర్పడితే మన గ్రామ రైతులు అనేక కష్టనష్టాలనుండి తప్పించుకుని స్వతంత్రంగా ఊపిరి పీలుస్తారు.

నాయనగారూ, ఇన్ని సహకార సంఘాలున్నయి గాని వ్యవ సాయానికి సహకారసంఘాలు లేవని అనుకుంటున్నారేమో. వ్యవ సాయానికి కూడా సహకార సంఘాలున్నాయి. రేపు మన మౌలిక జీవితాలలో, మన అలవాట్లలో ప్రవర్తనలలో మార్పులు తీసుకు వచ్చే సహకార సంఘాలు ఏమున్నావుంటే అవి వ్యవసాయ సహ కార సంఘాలే. మన దేశంలో వ్యవసాయం మూడుపువ్వులు ఆరు కాయలు కాచి పచ్చ పచ్చగా పది కాలాలపాటు ఉండాలంటె సహ కార వ్యవసాయమే మంచి దారి అని మన పెద్ద పెద్ద నాయకులు చెప్పారు.

# వ్యవసాయంలో ప్రత్యేకతలు

ఇతర పరిశ్రమలకు వ్యవసాయానికీ చాలా తేడా ఉన్నది. వ్యవసాయం లేకుండ ఏ దేశంలోకాని మానవుడు బ్రతుక లేడు. సబ్బులు లేకుండ బ్రతుకవచ్చు. అవసరంవస్తె బట్టలు లేకుండకూడ బ్రతుకవచ్చు. కాని అన్నంలేకుండ మనిషి బ్రతుకలేడు. అన్నమే కాదు మన బట్టమాత్రం ఎక్కడినుంచి వస్తున్నది. బట్టకు దారం గావాలె. దారానికి దూది గావాలె. దూది పండించటానికి వ్యవసాయం గావాలె. ఇక, వ్యవసాయం. ఎక్కడ చేస్తాం? భూమ్మీద. భూమిని మనకు ఇష్టమున్నంత పెంచుకోరాదు. అక్కర్లేకపోతే తగ్గించుకోరాదు. ఆ భూమిని మనం చేసినామా? అదే వున్నది. దాన్ని వాడుకుంటున్నాం. కడమ పరిశ్రమలలో అట్లగాదు-దేంతోటి బట్టలు నేస్తారో - ఆ మగ్గాల్ని - ఎన్నింటినైనా మనిషి తయారు చెయ్యవచ్చు.

ప్రపంచంలో మనుష్యులు పెరుగుతున్నారు. ఏటా కొన్ని లక్షల జనం పుడుతున్నారు. చచ్చేవాండ్లు చావంగ కొన్ని లక్షల జనం పెరుగుతున్నది. ఈ పెరుగుతున్న మానవ జాతినంతటిని సాదవలసింది ఈ వ్యవసాయం ఒక్కటే. ఇన్ని ప్రత్యేకతలు కలిగి ఉన్న వ్యవసాయం కలకాలం పచ్చపచ్చగా ఉంటేనే బ్రతుకు.

# భూములు ముక్కలుగా, చెల్లా చెదురుగా కూడదు

భూములు చిన్న చిన్న ముక్కలైపోతే వ్యవసాయానికి గిట్టుబాటుండదు. ఎందుకంటే ఒక అరకతో రెండెకరాలు దున్న వచ్చు ననుకోండి. ఒక్క గుంట లేక ఒక్కసెంటు దున్నటాని

కైనా ఒక్క అరక కావలసిందే గద! దానికయ్యే ఖర్చు పెట్టుకో వలసిందే గద! ఎరువులు వెయ్యటంలో, కలుపులు తియ్యడంలో క్రొత్త క్రొత్త పద్ధతులమీద వ్యవసాయం చెయ్యటంలో పెద్ద భూఖండం లాభదాయకం. చిన్నచిన్న భూఖండాలు నష్టదాయకాలు. కాని మనదేశంలో భూమి ముక్కలు ముక్కలుగా చీలిపోవటం వలన, ఆ ముక్కలుగూడ చెల్లాచెదురుగా చీలి పోవటం వలన చిన్న భూఖండాలు దిన దినం బాగా పెరుగుతున్నాయి.

## భూములు ముక్కలు కావడమంటే....

ఒక భూస్వామికి అయిదుగురు కొడుకు లున్నారనుకోండి. అతని మరణంతర్వాత ఆస్తిని అతని అయిదుగురు కొడుకులూ సమానంగా పంచుకుంటారు. అయిదెకరాల భూమి ఒకేచోట వున్న దనుకుంటె దాన్ని తలా ఒక ఎకరం చొప్పున ఆ అయిదుగురూ పంచుకుంటారు. యిటువంటి పంపకంవలన భూమి ముక్కలు ముక్కలవుతుంది.

## చెల్లా చెదురంటే?

చెల్లాచెదురంటే ఇంకా చిన్నముక్కలు చేసుటన్నమాట. మాటవరుసకు ఆ ఆసామికి ఉన్న అయిదెకరాలు ఒక్క చోట గాక అయిదుచోట్ల ఉన్నదనుకోండి. ఊరికి తూర్పున ఒకటుంటె, దక్షిణాన మరొకటి ఉన్నదనుకోండి. ఒకటి చెరువుక్రింద, ఒకటి ఏటికాల్వక్రింద, ఒకటి మోటబావిక్రింద మరొకటి ఏతాంక్రింద ఉన్న యనుకోండి. భాగాలు పంచుకున్నప్పుడు వాండ్లు తలా ఒక దిక్కు

తీసుకోరు. ఈ అయిదుచోట్ల ఉన్న వాటిలోనుంచి ఒక్కొక్క దాన్ని అయిదేసి భాగాలుగ పంచుకుంటారు. అయిదుగురూ కలిసి ఉన్న ఆస్తిని ఇరువై అయిదు ముక్కలు చేస్తారు. ఒక్కొక్క ఆసామి ఒక నాగలి కట్టుకొని ఒకపూట ఒకముక్కను, రెండో పూట మరోముక్కనూ దున్నుకుంటూఉంటాడు. ఒక్క పూటలో దున్నుకొని విత్తనాలు వేసుకోవలసిన ఎకరం భూమిని నాలుగు రోజులు దున్నుకుంటాడు.

## ఇతర కారణాలు

ఈ ఆస్తి పంపకాల వలననే కాక ఇంకా అనేకవిధాల భూమి ముక్కలు ముక్కలౌతుంది. ఏ అవసరం వచ్చినా ఇంత కొంద్రను కుదవ బెట్టో, అమ్మకం జరిపో తీర్చుకోవలసిందే గద! కొడుకు పుట్టు వెండ్రుకలకు అప్పు తేవాలన్నా, బిడ్డ పెళ్ళికి అప్పు సంపాయించాలన్నా, ఆఖరుకు ముసలయ్య చావుకు, దిన వారాలకు అప్పు తెచ్చి నడిపించాలన్నా ఆ భూమినే కుదువబెట్టో - అడిగిన ధరకు అమ్మో బైట పడవలసిందేగద!

## వ్యవసాయ సంస్కరణలు

మన దేశంలో వ్యవసాయం బాగు పడటానికి పెద్దలు తలా ఒకదారి చూపించారు. నాగలిపట్టి దున్నేవాండ్లెందరికో ఇవాళ చాలినంత భూమి లేదు. పట్టణాలల్లో వుండి పెద్ద పెద్ద బంగళాలలో సుఖంగా బతుకుతున్న పెద్ద పెద్ద దొరలకు వేలకు వేల ఎకరాల భూమి ఉన్నది. అందుకని దేశంలో ఉన్న భూమినంతటిని దున్నే

వాండ్లందరికి సమానంగ పంచిపెట్టాల్నని కొందరన్నారు. అట్ల పంచిపెడితే అందరికీ తలా ఎకరమో, ఎకరంనరో వస్తది. ఆ విధంగా వచ్చిన ఎకరాన్నో ఎకరన్నరనో రైతు - ఏ అప్పు తీర్చుకొనుటానికో అమ్ముకోడనే నమ్మకం ఏమున్నది? పైగా భూమి చిన్నచిన్న ముక్కలై ఫల సాయం తగ్గిపోతుంది.

కొంతమంది పెద్ద భూస్వాములు ఈ వాదాన్ని పట్టుకొని భూమిని అందరికి సమానంగ పంచవద్దని బయలుదేరినారు. కాని అందరికి కడుపునిండ తిండి దొరికినప్పుడే మనకు స్వతంత్రం వచ్చినందుకు లాభం. నా కాళ్ళమీద నేను నిలుచుండ గలిగినప్పుడే నాకు స్వతంత్రం వుంటది. ఏ నలుగురు పెద్ద భూస్వాముల చేతుల లోనో నా బ్రతుకును పెట్టితే, స్వతంత్రం అనేది ఆ నలుగురు పెద్ద భూస్వాముల చేతులలో ఇరుక్కపోయి మయిల పడిపోతది. ఈ పెద్ద భూస్వాము లేమంటరంటే చిన్న చిన్న భూములున్న వారందరు తమ చిన్న భూములను ఈ పెద్ద భూస్వాములకు అమ్మకోవాలె. అప్పుడు చిన్న భూఖండా లుండవు. ఈ భూస్వాములక్రింద మళ్ళీ అందరూ పాలేర్లుగాచేరి దాన్ని దున్నాలె. ఎవరి కూలి వాండ్లు తీసుకోవాలె. లాభాలుమాత్రం భూస్వామిగారు కమ్మగా కాలుమీద కాలువేసుకొని అనుభవిస్తాడు.

కొన్ని దేశాలలో ఈ చిక్కును ఇంకోతీరుగ విడదీశారు. భూములు అమ్మకాన్ని, కొనటాన్ని బందుచేసినారు. చిన్న చిన్న భూఖండాలను సర్కారువారేకొని దానిమీద మళ్లీ పాలేర్లను పెట్టి వ్యవసాయం చేయించారు. పైపద్ధతిలో లాభాలను భూస్వామిగారు

తింటే ఈ పద్ధతిలో సర్కారువారు తిన్నారు. ఎంతజేసినా దున్నిన రైతుకుమాత్రం కూలి రాళ్లే మిగిలినవి.

## సహకార వ్యవసాయం

ఈ చిక్కులన్నీ పోవటానికి ఒక్కటే దారి కనుపడుతున్నది. అదే సహకార వ్యవసాయం. మన వూళ్లో ఉన్న భూమి నంతటినీ ఒక్కదగ్గర చేర్చేదీ, అందరూ కలిసి దున్నేదీ.

ఇందులో మళ్లీ రెండు రకాలున్నాయి. ఒకటి సహకార వ్యవసాయం, రెండోది సమిష్టి వ్యవసాయం.

సహకార వ్యవసాయ మంటే అందులో ఎవరి భూమి మీది హక్కు వాండ్లకే వుంటది. ఎవరిభూమిని వాండ్లే దున్నుకుంటారు. కాని, సహకార పద్ధతిమీద తమకు కావలసిన ఎరువులను, మేతను వ్యవసాయానికి పనికివచ్చే పనిముట్లను కొనుక్కుంటారు. పంట పండినతర్వాత పండినపంటను మళ్ళీ సహకార సంఘం ద్వారానే అమ్ముకుంటారు. ఈ పద్ధతి సహకార వ్యవసాయం- సమిష్టి వ్యవసాయానికి మొదటిమెట్టు.

## సమిష్టి వ్యవసాయం

సమిష్టి వ్యవసాయమంటే అట్లగాదు. అందరూ తమ తమ భూమిని ఒక్కదగ్గర కూడపెడతారు. అంటే భూమిమీద తమ కున్న హక్కును సహకార సంఘానికి అప్పజెప్పుతరు. సహకార సంఘం వాండ్లే ఏభూమిని ఎవరు దున్నాల్నో నిర్ణయిస్తారు. దేనిలో

ఏపంట పండాలె, ఎక్కడ ఎంత ఎరువు దోలాలె, ఎక్కడ ఎటు వంటి విత్తనాలు పెట్టాలె మొదలైనవన్ని సంఘమే నిర్ణయిస్తది. పంట పండినతర్వాత పనినిబట్టి అందరికి దాన్ని పంచుతారు. సంఘాన్ని నడుపటానికి కొంతపంట ఉంచుకుంటది.

## కొన్ని చిక్కులు

ఈ పండిన పంటను ఎట్ల పంచాలనేది పెద్ద చిక్కు. అవసరాన్నిబట్టి పంచాలెనా? పనినిబట్టి పంచాలెనా? అతడు సంఘాని కిచ్చిన భూమినిబట్టి పంచాలెనా ?

ఒక ఇంట్లో అందరు ఆడవాండ్లే వుంటారు. పని చెయ్య లేరు, మరి వాండ్లు ఆకలితోటి చావ వలసిందేనా?

ఒక భూస్వామి పదెకరాలు సంఘాని కిచ్చాడు. అతనికి తాను దప్ప ఇంక తినేవాండ్లులేరు. మరొకరైతు ఒకటే ఎకరం ఇచ్చిండు. ఆ యింట్లో పదిమంది తినే వాండ్లున్నారు. ఎవరికి ఎంత ఇవ్వాలె? ఎవరికి ఎంత ఇస్తె న్యాయం?

పదెకరాలిచ్చిన భూస్వామి ఒక్కటే నాగలి దున్నిండు. ఒక్క ఎకరం ఇచ్చిన రైతు తాను తన కుటుంబం కలిసి పది నాగండ్లు కట్టినారు. ఎవరికి ఎంత పంచాలె?

అవసరాన్నిబట్టి పంచుతె, కొంతమంది పని దొంగలు తయారైతరు. ఇచ్చిన భాగాన్నిబట్టి పంచుతె ఈ అసమానతలు ఇట్లనే వుంటయి. ధనవంతులకు పెద్దపాలు, దరిద్రులకు చిన్నపాలు పోతది. కాదయ్యా చేసిన పనినిబట్టి పంచుదామంటె పదెకరా

లిచ్చిన ఆసామికంటె ఒక్క ఎకరం ఇచ్చిన ఆసామికే ఎక్కువ పాలు వస్తది. ఆ ఆసామి సంఘానికి పదెకరాలు ఎందు కియ్యాలె?

## చిక్కులు తొలిగించవచ్చు

ఈ చిక్కులను ఒక్క నడిమిదారిన విడదీయవచ్చు. పంట రాంగానే దానిలోనుండి కొంతభాగం దాన ధర్మాలకు, మరికొంత భాగం సంఘంకోసం తియ్యాలె. ఇట్ల తీసినదానిలోనుండి పని చెయ్యలేని వాండ్లను సాదాలె. ఇటువంటి పనిచేతకాని వాండ్లను ఎల్లప్పుడు సాదటానికి సంఘం పూచీపడవద్దు. వాండ్లు కొంచెం కోలుకోంగానే ఆడ, మగ అనే భేదంలేకుండ పనికిపోవాలె.



ఇట్ల పంచంగా మిగిలిన పంటలోనుంచి న్యాయమైన కూలి రేటు చొప్పున పనినిబట్టి పంచాలె. అంటె నాగలికింత అని నాగటి పాళ్ళు పంచాల్నన్నమాట. ఎరువులు, కలుపులు మొదలైన వాటి ఖర్చులన్ని తియ్యాలె. ఇవన్నీ తియ్యగా, నాగలి పాళ్లు పోగా ఇంకా పంట మిగులుతుంది. దాన్ని భూమి పాళ్ళుజేసి పంచాలె. ఇట్లా జేస్తే ఒక్కొక్కరికి భూమి పాలుకు భూమి పాలు వస్తది,



నాగటి పాలుకు నాగటి పాలు వస్తది. భూమి పాలు కొద్దిగ వచ్చే రైతుకు నాగటిపాలు ఎక్కువరావచ్చు. ఈ ప్రకారంగ అందరు కడుపునిండ తిని, కలిసి కమ్మగ బ్రతుకవచ్చు.

అయితే ఇట్ల సమిష్టి వ్యవసాయం మొదలు పెట్టినట్లయితె మన స్వతంత్రం దెబ్బ తింటదని కొందరు అంటున్నారు. "నాకున్న కొంద్రలో నేను జొన్న పండించుకుంటనో, పొగాకు పండించు కుంటనో నా యిష్టం, నడుమ ఈ సంఘం పెత్తనం దేనికి?" అంటారు.

ఒక్కసంగతి మీకు ఇదివరకే రాయవలసి ఉండె. మరచి పోయిన. మరచిపోవుడుగూడ మంచిదే అయింది. ఎందుకంటె ఇప్పుడు అనుమానం వచ్చినప్పుడు అక్కరకు వస్తున్నది గద.

సహకార సంఘంలో ఒక సూత్ర మున్నది. అదేందంటే "ఒక్క మనిషికి ఒక్క ఓటు" అనేది. ఈ సంఘం ఎక్కడి



నుంచో వచ్చి మనవూళ్ళో పీఠంవేసుకొని కూర్చుంటుందను కుంటున్నరేమో? కాదు. మనవూరు వాళ్ళమే అందరంగలిసి ఒక సంఘాన్ని ఎన్నుకుంటాం. అప్పుల సహకార సంఘమైనా, కౌను గోలుదార్ల సహకార సంఘమైనా మనం ఎన్నుకున్న వాండ్లే నడుపు తరు. ఈ ఎన్నుకొనుడుగూడ మనిషికి ఒక ఓటు చొప్పున ఎన్ను కుంటరు. పదెకరాలు ఇచ్చినాయనా, ఒక్క ఎకరం ఇచ్చి నాయనా ఒక్కొక్క వోటేవేస్తరు. పరపతి సంఘానికి వందరూపాయలిచ్చి నాయనా, పది రూపాయలిచ్చినాయనా తలకొక ఓటుమాత్రమే వేస్తరు. ఇట్ల ఎన్నుకున్న సంఘంగూడ కొన్ని సూత్రాలకు కట్టు బడి నడువాలె. కొన్ని గిరులు గీస్తరు. అవి దాటకూడదు. ఇవన్నీ కాంగ ఈ సంఘం లెక్కలు రాసి పెట్టాలె. మనంపరిమీద సంఘం పెత్తనం చెయ్యదు. మనందరికి సంఘం సేవచేస్తది. మన మామిడితోటను కాయుమని తెనుగు రామయ్యకు చెప్పినమనుకోండి. తెనుగు రామయ్యను మన మామిడితోటకు రాజును జేసినట్టా? కాదుగద. అయినా మన పిల్లలు మామిడి పిందెలను తెంపి పారే స్తుంటె రామయ్యవచ్చి కోప్పడతడు. ఆ హక్కు ఆయనకున్నది గద. సంఘంగూడ అంతే.

ఇంకో సంగతి, స్వతంత్రమంటె ఏంది అనేదాన్ని మొదలు దెలుసుకోవాలె. నాకు స్వతంత్రమున్నదని మందింటిమీద నిప్పు వెయ్యవచ్చునా? నాకు స్వతంత్రమున్నదని నేను విషందాగి చచ్చి పోవచ్చునా?

నాయనగారూ, మనం ఇన్నాళ్ల పోట్లాడి సంపాదించుకున్న స్వతంత్రం బ్రతుకటానికి గాని చచ్చుటానికి గాదు. గాంధిమహా

త్ముడు తన బొక్కల దేహంతోటి పోట్లాడి తెచ్చిన స్వతంత్రం మనుషులు అందరు బతుకటానికిగాని కొందరు బతుకటానికి గాదు.

అందరం బతకాలె. అందరం కమ్మగా బతకాలె. అందరం కలిస్తేనే బతుకుతం. కలువకపోతె మనలో మనమే ఒకండ్ల నొకండ్లు చంపుకొని చస్తం. పోటీ ఆర్థికవ్యవస్థ యాదవ కులానికి మొసలం వంటిది. సహకార వ్యవస్థ సంజీవి వంటిది. ఏదికావలెనో ఏరు కోవాలె? ఎంత ఆలస్యం జేస్తే అంత ముప్పు ముందుకు వస్తున్నది. త్వరపడాలె. బ్రతుకటానికి తయారీలు త్వర త్వరగా చేసుకొని చావుతోటి పోట్లాడాలె.

ఈ సారికిక ఉంటాను. సందేహాలేమన్నా ఉంటే రాయండి. మళ్ళీ చర్చించుకుందాం.

మీ వా డు.



# మూడవ ఉత్తరం

పూజ్యులగు నాయనగారికి నమస్కారములు.

అనేకమైన సందేహాలతో కూడిన మీ ఉత్తరం అందింది. ఇప్పుడుంటున్న సహకార సంఘాలను జూస్తే నేను కంటున్న కలలకు వాటికి ఎక్కడ పొత్తు కుదిరేటట్లు లేదంటారు. కాని ఉన్న చిక్కంత తప్పులెన్నడంలోనే వస్తున్నది. ఇప్పుడున్న సహకార సంఘాలు ఇల్లా వుండటానికి అందులోవున్న తప్పులతోపాటు మనం జేస్తున్న తప్పులుగూడ ఉన్నయని మీకు ఇదివరకటి ఉత్తరంలోనే రాశాను. మన ఇల్లు దోచుకుంటున్నట్లు మనకు తెలిసి గూడ మనం ఊరుకుంటున్నామంటె తప్పెవరిది? అట్ల ఊరుకుంటె దొంగలు మన తలకాయలుగూడ కోసుక పోతారు. మనం నిద్ర నుంచి లేస్తే, ఇప్పుడున్న సహకార సంఘాలలోని సగం తప్పులు వాటంతటవే మాయమౌతయి.

ఇప్పటిదనుక సహకార సంఘమంటె మనకు అదొక తీరుగ మనసున బట్టింది. సహకార సంఘమంటె సర్కారు అప్పులిచ్చె కార్యాలయమనుకున్నాం. సంఘంలో అన్యాయాలు జరుగుతె సర్కారును తిట్టుకున్నాం. కాని సహకార సంఘమంటె మనకు మనమే, ఇంతకన్న మంచిగ బ్రతుకటానికి పెట్టుకున్న సంఘమని ఎన్నడనుకున్నాం గనుక.

ఇవాళ సర్కారు సహకార సంఘాలకు, దాని మూల ధనం కంటె మూడింతలు అప్పులిస్తున్నది. అంటె మనం మనం గలిసి

మంచిగ బ్రతుకటానికి సంఘం పెట్టుకుంటె సర్కారు మనకు నీడగ నిలుచుంటున్నది. మనలో మాటకు-రేపట్నుంచి సర్కారు మనకు అప్పులిచ్చుడు మానేస్తదనుకుందాం. సహాయం చెయ్యదు. అయితె మనం మంచిగ బ్రతుకుడు మానుకుంటామా? సర్కారు మనకు విషం గలిపిన అన్నం పెడితె మనం తింటామా? అట్లు బెట్టే సర్కారును గద్దెమీదినుంచి దించనన్నా దించుతం చేత గాక పోతె ఉపవాసమన్నా ఉంటం గాని విషం గలిపిన అన్నం మాత్రం దినం గద. ఈ సహకార సంఘాలు మనవి. మనం పెట్టుకున్నం. మనకు సర్కారు సహాయం జెయ్యాలె. చెయ్యకపోయినా మన సంఘాలను మనం కూలకొట్టుకోం. పైగా సర్కారు మనకు సహాయం చెయ్యన్నాడు, మనకు ఎదురు తిరిగిన్నాడు మన మందరం ఒక్కటయి సర్కారునే కూలగొడతం.

నాయనగారూ, సర్కారు ఎవరికోసమని సహాయం జేస్తది? మనం పన్నులు ఇయ్యకుంటె సర్కారు ఎట్లా బ్రతుకుతది? మనం ఆకలి తోటి బాధపడుతుర్రంటె సర్కారుకు అప్పులెక్కడ నుంచి దెచ్చిస్తం? మనం సుఖంగా వుంటేనే సర్కారు సుఖంగవుంటుంది. మన కడుపులు నిండిన్నాడే సర్కారు పునాదులు గట్టిగ ఉంటయి. కడుపులో మన పేగులు ఒర్రిన్నాడు సర్కారు గద్దె కింద మీద గావలసిందే. దాని పునాదులు కదలవలసిందే. మన దేశంలో ఇప్పు డున్నది మన సర్కారు గనుక మనకు సహాయం జేస్తున్నది.

ఇప్పుడున్న ఈ సహకార సంఘాలను బాగుజెయ్యాల్నంటే, సర్కారు నౌకర్ల చేతుల్లోంచి ఈ సంఘాలను మనం తీసుకోవాలె.

ఎన్నుకునేటప్పుడు చదువుకంటె నీతి పెద్దది. నీతివంతునికి నాలుగక్షరాలు వచ్చినాసరే. బియ్యేలు, యమ్మేలు పాసయిన అవినీతివంతుల కన్న వెయ్యిరెట్లు నయ్యం. చదువువచ్చి, నీతివంతుడు అయినవాడు దొరికితె ఇక బంగారం దొరికినట్టేనాయె. అటువంటి వాండ్లను మనవూళ్ళోనే తయారు జెయ్యాలె. నీతివంతులకే ఓట్లు వెయ్యాలె. మీ ఆజ్ఞ అయితె నేను స్వయంగావచ్చి అక్కడ వుండి ఈ బాధ్యతలన్ని బుజానవేసుకొని మోయటానికి సిద్ధంగా ఉన్నాను. అయితే మీబోటి పెద్దలు నాకు అండగ నిలుచుండాలె.

తాటి చెట్టు ఎక్కే వాణ్ణి ఎంత దూరం లేపుతారు? కొంత దూరం ఎక్కినాక అతడే తన స్వంత ఉపాయం మీద పైకి పోవాలె. చేతకానివాడు మూతి పండ్లు విరిగేటట్టు క్రింద పడి పోతాడు. "సర్కారు చేస్తున్న సహాయం తాటిచెట్టు ఎక్కేవానికి ఇచ్చే ఆసరావంటిది. అది మొదట్లోనే వుంటది. తరవాత మనంతట మనమే స్వంత శక్తితోనే పైకి పోవాలె."

.... .... .... ....

నాయనగారూ, ఈ మూడు త్తరాల్లో మీకు నేను కొన్ని ముఖ్యమైన ఆర్థిక శాస్త్ర సూత్రాలు చెప్పటానికి ప్రయత్నించినాను. మీకు నేను చెప్పుడు తప్పే. కాని మీరు నన్ను చదివించారు గనుక నా బాధ్యతను నేను నిర్వహించాలె. ఎవరికివారు ఇప్పుడు మంచిగ బ్రతుకుటానికి రెండు సూత్రాలు చెపుతాను.

## ౧. అప్పు చేయవద్దు

ఆకలి తోటి చచ్చినా సరే గాని అప్పుచేసి పప్పు కూడు తిన వద్దు. మీకు మాత్రం తెలువదా? మనవూళ్ళోనే ఎన్ని సంసారాలు అప్పులకు ఆహుతయినవి? ఒక్కసారి అప్పు తీసుకున్నామా ఇంక అది జన్మ జన్మాలకు తీరదు. మన కేమో ప్రతి దానికి అప్పు తీసు కునే అలవాటు. అందుకనే వెనుకటికి ఒక పెద్ద మనిషి మనను గురించి అన్నడట....

"భారత దేశంలో రైతు అప్పు తోటే పుట్టి అప్పు తోటే చస్తడని"

మన మల్లయ్య సంగతే చూడండి. అతనితండ్రి చనిపోయే టప్పుడు అతనికి అప్పులను గూడ అప్ప జెప్పి పోయినాడు.



తర్వాత ఆ తండ్రి దిన వారాల కని మల్లయ్య మరీ కొంత అప్పు జేశాడు, ప్రతి ఏట పండిన పంట సావుకారుకే పోస్తున్నడు. తాను గటక, చింత అంబలే తాగు తున్నాడు. కాని అప్పు మాత్రం తీరుతులేదు. ఇంతటితో మల్లయ్య అప్పులు దెచ్చుడు మానుకుం టడా? ఊహూ.... రేపు కొడుకు పుట్టు వెండ్రుకలకు అప్పు దెస్తడు. ఎల్లుండి బిడ్డ పెండ్లికి





అప్పు దెస్తడు. ఉన్న ఆస్తి నంత కుదువ పెట్టి అప్పులు జేస్తడు. తండ్రి తన కిచ్చిపోయిన 'ఆస్తి - అప్పు' అనే రెండింటిలో మొదటిదాన్ని తగ్గించి రెండో దాన్ని పెంచి తాను జస్తూ తన కొడుక్కు అప్పగించి పోతాడు. ఇది ఇట్లగే నడుస్తుంటది. ఆక రుకు ఒకనాడు సావుకారు వచ్చి భూమినీ ఇల్లునూ కబ్జా చేసుకొని మల్లయ్య పెండ్లాం బిడ్డలను ఇంట్లోంచి బయటకు గెంటి వేస్తడు. వీళ్ళందరు కడుపులు చేత బట్టుకొని ఇంటింటికి బిచ్చానికి బయలు దేరుతరు. ఒకడు ఏటిఒడ్డున ఒకడు బాటలో చచ్చిపోతారు. పీనుగును ముట్టే దిక్కుండరు. అప్పుడు గాని అప్పులు తెచ్చుడు మానుకోరు. అప్పుడుగాని వాళ్ళ అప్పులు తీరవు.



నాయనగారూ, ఈ కథంత తలుచుకుంటె కండ్లకు నీళ్ళు వస్తున్నయి. కాని ఈ మాటనే మల్లయ్యకు చెప్పితె కోపానికివచ్చి నామీద దుడ్డుగర్ర దిరగేస్తడు. అంత రోషం మనిషికి.

ఇట్ల ఎందుకైతె దనుకున్నరు? అప్పు తెచ్చినచోట వడ్డీ కూడ ఉంటది. ఆ వడ్డీ ఎప్పటికప్పుడు పెరుగుతునే వుంటది. ఎప్పుడు తీర్చినా ఈ మనిషి వడ్డీ తీర్చుదేకాని అస్సలుకు ఒక్క గవ్వగూడ జమకాదు. ఇది అప్పులలో ఉన్న కిటుకు.

ఇంకొకటి. తీసుకునే అప్పు దండగమారి పనులకు దప్ప అక్కరకు వచ్చే పనులకు దీసుకోరు. పెళ్లికో, చావుకో, సంతర్పణకో, బొట్లకో బోనాలకో తీసుకుంటరు. అందుకని తీసుకున్న డబ్బు వట్టిగనే ఖర్చయితది. అప్పు తీసుకున్నా ఏదన్న మంచిపనికి తీసుకోవచ్చు.

సహకార పరపతి సంఘాలు బెట్టుకుంటె ఈ చిక్కులు కొన్ని తీరిపోతాయి.

## ౨. అవసరాలను ముందు పూర్తి జేసుకోవాలె

రెండో ముఖ్య సూత్రం మీకు నేను చెప్పాలనుకుంటున్నది ఏమిటంటే అవసరాలను ముందు పూర్తిచేసుకొమ్మని. మీకు రాసిన మొదటి ఉత్తరంలో బ్రతుకు దెరువు కవసరమైనవి కొన్ని—విలాసాలు కొన్నీ వుంటాయని రాశాను.

ఏ వస్తువులు లేకుండా మనం బ్రతుకలేమో అవి జీవితానికి అతిముఖ్యమైన అవసరాలు. అందుకని మనం మన ఆదాయాన్ని ముందు వీటిని కొనుటానికి ఖర్చుపెట్టాలె. తిండీ, బట్ట, ఇల్లు మొదలైనవి ఇందులోకి వస్తయి.

వీటి తర్వాత కొన్ని సౌకర్యాలుంటాయి. బ్రతుకును సుఖవంతం చేసుకోవటానికి అవి అవసరం. అవి లేకపోతే మనం చేసేపనిని మంచిగ చెయ్యలేం. మంచి పని ముట్టుంటె పని మంచిగ జరుగుతది. కట్టె నాగలికంటె ఇనుప నాగలితోటి

భూమిని లోతుకు దున్నవచ్చు. వట్టి కాళ్ళకంటె చెప్పులుంటే నడక కొంచెం నిర్భయంగ దూగుతది. ఇటువంటివన్ని సౌకర్యాల క్రిందికివస్తవి. మొదటిరకం ముఖ్యఅవసరాలు తీరిన తర్వాత మిగి లిన డబ్బును వీటిమీద ఖర్చు చెయ్యాలె.

ఇవన్నీ పోంగ మిగిలిన డబ్బుంటె వాటిని విలాస వస్తు వులకు ఖర్చు పెట్టవచ్చు. ఏవి లేకున్నా బ్రతుకు మంచిగనే సాగు తదో వాటిని విలాస వస్తువులంటారు. సినిమాలు, నాటకాలు, సిల్కుబట్టలు—ఇవన్ని విలాస వస్తువులక్రిందికి వస్తవి.

అయితే వస్తువులను ఈ విధంగా మూడురకాలుగా విభజిం పడం కష్టం. ఎందుకంటె ఒక దరిద్రునికి బండి విలాసవస్తువే కావచ్చు - కొంచెం డబ్బున్నవానికి అది చాలా అవసరం. ఇంకా ఎక్కువ డబ్బుంటె మోటరుకారే కొనుక్కుంటారు. పనులను బట్టి గూడ కొన్ని వస్తువులు అవసరాలు, మరికొన్ని విలాసాలు అవుతాయి. ఎండలో తిరిగే పల్లెటూరి రైతుకు చలువ సులోచనాలు అవసరం. పట్టణంలో ఇనుప విసనకర్రల గాలిలో కూర్చుంటే వానికి చలువజోళ్లు విలాసం. తెల్లారకముందే చలిపూట లేచి పొలానికి పొయ్యే నీకు ఉన్ని అంగీ (స్వెట్టరు) అవసరం. రోజు ఎనిమిది గొట్టంగ లేచే నీ కోడలుకు అది విలాసం. అట్లాగే పట్టణంలో ఉద్యోగం చేస్తున్న వారికి గడియారం అవసరం. అదే పల్లెటూరి రైతుకు విలాసం.

ఈవిధంగా ఈ అవసరాలు, సౌకర్యాలు, విలాసాలు మను షుల ఆదాయలను బట్టీ వారుచేస్తున్న వృత్తులను బట్టి మారుతున్నా,

కొంచెం శాంతంగా ఆలోచించుకుంటే ఎవరికి వారు తమ తమ అవసరాలేమిటి, విలాసాలేమిటి అనేవి నిర్ణయించుకోవచ్చు.

వీలైతే విలాసాలమీద కర్చు ఎంత మానివేస్తే అంత



మంచిది. దాని మీద పెట్టే కర్చును పొదుపు చేసి ఇంకెందులోనన్నా పెట్టుబడి పెట్టుకోవచ్చు.

పొదుపు చేయటం చాలా అవసరం. మనకు తెలియకుండా ముమ్ముందు పెద్ద పెద్ద కర్చులు వచ్చి పడవచ్చు. ఒక యేడు పంటలు మునుగవచ్చు. పెద్ద పెద్ద రోగాలు రావచ్చు. అవన్నింటినీ ఎదుర్కొనటానికి మన దగ్గర కావలసినంత డబ్బుండాలె. లేకపోతే సావుకారు దగ్గరికే పోవలసి వస్తుంది. ఒక్కసారి సావుకారు

వలలో చిక్కితిమా, నేనింతవరకు చెప్పిన మల్లయ్య కథ గిరున తిరుగవలసిందే.

ఈ రెండు మంచిగ బ్రతుకటానికి మూలసూత్రాలు. అయితే ఎవరికి వారే యమునా తీరే పద్ధతిలో బతుకులు సాగుతున్నంత కాలం మనబోటి బీదవాండ్లకు ఈ మూల సూత్రాలను పాటించడం కష్టం. అందరు మంచిగ బతకాల్నంటె అందరు కలిసి బ్రతకాలె. కలిసి బ్రతకటానికి సహకార సంఘాలు మొదటి మెట్లు. ఒక్కొక్క సహకారసంఘం, మనిషికి కలిసి బ్రతికే పాఠాలు నేర్పే పాఠశాల వంటిది. బ్రతుకును గురించిన పాఠాలు ఆ బడిలో నేర్చుకుందాం. ఆ పాఠాలతో మనబ్రతుకులు దిద్దుకుందాం.

ఇంతటితో నా ఉత్తరం ముగించవలసిందే. ఊరికే ఇటువంటి రాతలతోను, ఉపదేశాలతోను జరిగే పని తక్కువ. ఏదో ఒకటి చేసి చూపించాలె. చెప్పటానికేంది మస్తుగ నీతులు చెప్పవచ్చు. చెప్పే వాడెప్పుడూ గడ్డమీదనే ఉంటడు. నీళ్ళలోకి దిగితే గాని లోతు దెలువదు.

అయితె సహకార సంఘం అనేది ఎట్లా మొదలు పెట్టాల్నో రెండుమాటల్లో చెప్పి ఊరుకుంటాను. ఎటువంటి సహకార సంఘం పెట్టదలచుకున్నా ముందర ఒక పదిమందినన్నా చేర్చాలె. ఎక్కువ వుంటె మంచిదే; కాని అంతకు తక్కువ వుండకూడదు. ఈ పది మంది కలిసి ఒక సహకార సంఘంగా ఏర్పడాలె. ఇది ఏం సహకార సంఘమో నిర్ణయించుకోవాలె. అంటె పరపతి సంఘమా?

వ్యవసాయ సహకార సంఘమా? బహుళార్థ సహకార సంఘమా తేల్చుకోవాలె. సహకార సంఘాలు ఎన్ని రకాలుగా ఉండవచ్చో నేను రెండవ ఉత్తరంలో మీకు రాశాను. అందులో ఏరకపు సహకార సంఘంగా ఏర్పడ దలచుకొన్నారో తెలుపుతూ—సహకార సంఘాల రిజిస్ట్రారు గారికి రాస్తే అయన మీ సంఘాన్ని రిజిష్టరు చేసుకుంటాడు. మీ సంఘానికి ఒక నియమావళి ఉండాలె. నియమావళి నమూనాలు కేంద్ర సహకార సంఘ కార్యాలయంలో అచ్చయినవే దొరుకుతాయి. మీది ఏరకం సహకార సంఘమో తెలుపుతూ కేంద్ర సహకార సంఘానికి రాస్తే వారు ఆ రకపు సహకారసంఘం నియమావళి నమూనా పంపిస్తారు. మన అవసరాలను బట్టి మనం మనకు తోచిన మార్పులు, చేర్పులు, అందులో చేసుకోవచ్చు.

ఈ మార్పులు చేసుకున్న నియమావళిని సహకార సంఘాల రిజిస్ట్రారుకు మనం రిజిస్ట్రేషనుకు మొదట పెట్టే దరఖాస్తుతో బాటే పంపాలె. మన సంఘం మూలధనాన్ని ఏదన్నా ఒక బేంకులో, బేంకు లేకపోతే టపాఖానలో పెట్టాలె. మన సంఘం రిజిష్టరయిన తర్వాత సర్కారువారు మనకు అవసరమైనప్పుడు అప్పులిస్తారు. ఇదీ పద్ధతి.

ఇక వెంటనే ఏదో ఒక సహకార సంఘం స్థాపింపడానికి పూనుకొంటారని, మనుషులు కలిసి బ్రతికే బాటలో తామే ముందడుగువేసి మార్గదర్శకులౌతారని ఆశిస్తూ ఇంతటితో ముగిస్తున్నా.

కోడలూ పిల్లవాడూ క్షేమం, మీరు ఎప్పుడు కదలిరమ్మంటే అప్పుడు పట్టణంనుంచి పల్లెలకు కదలి రావడానికి సిద్ధంగా వున్నాము.

సెలవు.

మీ వాడు.



KALASI BRATUKUDAM
By
SURAMOULI.

Published by
DEEPTI PRACHURANALAYAM
SURYAPET - Nalgonda Dt.